## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050014512

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# బాల నీతికథలు

## మొదటి భాగము

BY

A. L. NARAYANA

Revised by

M. VENKATARATNAM, B. A.



*Publishers :*

**Sundara Ram & Sons, Tenali.**



చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు

1932

·right)

(*Price 0—2—0.*

# విషయసూచిక

ఓమ్.

# బాలనీతికథలు

## మొదటి భాగము.

### ౧. తప్పు దిద్దుట.

పూర్వకాలమున జయంతుడను ఒకరాజు గలడు. ఆయన మిక్కిలి చెడ్డవాడు. ఎల్లప్పుడు సారాయి త్రాగును. జూదమాడును. ధనము కొఱకు తన రాజ్యములోని ప్రజలను బాధించును. అడిగినంతధన మియ్యకున్న ఏదో యొకవంకబెట్టి కఠినముగా శిక్షించును. ఒకొ్కకప్పుడు ఇండ్లలో చొరబడి దోచుకొనును. స్త్రీలను బలవంతముగా నైన చెఱచును.

ఇతనికి తోడు మంత్రిగూడ మిక్కిలి చెడ్డ వాడు. రాజునకు మంచిబుద్ధి గఱపుటకు మారుగా చెడుబుద్ధి గఱపెడివాడు. ఇతడు గూడ ధనముకొఱకు ప్రజలను బాధించును. ఈయిరువురు పెట్టుబాధలకు ప్రజలు తాళ జాలకుండిరి. ఎట్లయినను రాజుగారితప్పును దిద్దవలెనని ప్రజలు ఆలోచించిరి. రాజు గారి సైన్యాధిపతి వీరికి తోడయ్యెను.

ఒకనాఁడు రాజుగారు సైన్యాధిపతినిబిలిచి "ఓయీ! ధనము చాలతక్కువగానున్నది. ప్రజల యిండ్లుదోచి ధనము తెమ్ము. అడ్డము వచ్చిన వారిని చంపుము" అనిచెప్పెను. అందుకు సైన్యాధిపతి "అయ్యా! మీతప్పును

ఇంకనైన దిద్దుకోవలెను. ప్రజలను బాధించుట తగదు. మీరింకను చెడుబుద్ధి మానకున్న మేము మీమాటవినము. ప్రజలుగూడ మీమాట వినరు. మేమందఱము ఒకటియగుదుమేని మీరును, మీమంత్రిగారును ఏమియు చేయలేరు. మీబ్రతుకంతయు మాచేతులలోనున్నది. కావున మామాట వినవలెను." అని ఖండితముగా చెప్పెను.

ఆమాటలకు రాజుగారికి కోపము వచ్చెను. తనచెంతనున్న భటుని జూచి "వీనిని నరికి వేయుము" అని యాజ్ఞాపించెను. అందుకు వాడును సైన్యాధిపతి చెప్పినట్లే చెప్పెను. ఇంకొకనితో చెప్పగా వాడును అట్లే

చెప్పెను. ఈరీతిగా ఒక్కడైనను రాజు గారి మాట వినలేదు. అప్పుడు రాజుగారు బుద్ధితెచ్చుకొని తనతప్పును దిద్దుకొనెను. అది మొదలుగ ప్రజలు సుఖపడిరి. ఎంత యధికారమున్నప్పటికి చెడునడత పనికి రాదు.

---

## ౨. లోభము హానికరము.

ఒకయూరిలో రమణయ్యయను ఒకకాపు గలడు. ఇతడు గొప్పధనవంతుడు. అయి నప్పటికి ఒకరికింత పెట్టడు. తానైన తినడు. ఇంకను ధనము ధనమని ఆరాటపడు చుండును. ఏదైన ఒకవస్తువును గొనవలసి నట్లయిన దమ్మిడిదగ్గఱనుండి బేరమాడును.

మర్యాద పోవునన్న భయముగూడ ఆయ
నకు లేదు.

ఒకనాఁడు ఆయన భార్య ఏదోయొక
నోము నోచుకొనుచుండెను. అందు
కొఱకు రెండు కొబ్బెరకాయలు అవసర
మయ్యెను. లేని పోని ఖర్చు ఎందుకని రము
ఐయ్య ముందుగనే భార్యను తిట్టెను. కాని
యీఖర్చుమాత్రము తప్పలేదు. రెండణాలు
చేత పుచ్చుకొని అంగడికిపోయి బేర
మాడెను. ఎంతవఱకు బేరము కుదురలేదు.
అంగడివాడు విసుగుతో "అయ్యా! మీ
కిక్కడ బేరము కుదురదు. తోటకుపొండు.
అక్కడ చాల చౌకగా దొఱకును" అని
చెప్పెను.

రమణయ్యకు కావలసినది చాకగా దొఱుకుటయే. కనుక వెంటనే తోటకరిగి యచ్చటివాని బేరమాడెను. తోటవాడును విసిగి "అయ్యా! మీకు డబ్బు ఖర్చుచేయుట యిష్టములేదు. మీకు ఊరకనే కాయలు దొఱకు ఉపాయము చెప్పెదను. అదిగో అటుచూడుడు. ఆబావియొద్దున చెట్టున్నదిగదా? బావిలో పడునేమోయని ఆ చెట్టు కాయలను మేము కోయలేదు. మీ రాచెట్టెక్కి యిష్టము వచ్చినన్ని కాయలు కోసికొనుడు." అని చెప్పెను.

ఆమాట విని రమణయ్య యెంతో సంతోషపడెను. చెట్టెకుటాట చేతగాకపోయినప్ప

టికి కాయలమీది యాశచేత మెల్లమెల్లగా చెట్టెక్కి గెలపట్టుకొనెను. ఇంతలో బోరున గాలికొట్టసాగెను. రమణయ్య యెక్కిన చెట్టు గాలిదెబ్బకు పడిపోవున ట్లుండెను. అప్పుడుగూడ రమణయ్య గెలను విడువ లేదు. గాలిదెబ్బకు చెట్టు పడకున్నను గెల మాత్రము విరిగెను. పాపము! రమణయ్య గెలతోగూడ బావిలో పడెను. బావిలో పడినతరువాత అతనికి బుద్ధివచ్చెను. తోట వాడు జాలిగుండె గలవాడు గనుక రమ ణయ్యను పైకిదీసి కాపాడెను. ఆరోజు మొదలుకొని యాకాపువాడు మంచిబుద్ధి గలవాడయ్యెను.

---

## ౩. మేలుచేసినవారికి కీడు చేయరాదు.

పూర్వ మొకప్పుడు రాకుమారు డొకడు వేటకుంబోయెను. సాయంకాలము వఱకు వేటాడి ఇంటికి వచ్చుచుండ ఒక పెద్దపులి యాతని వెంటబడెను. అతడు భయపడి దగ్గఱనేయున్న ఒకచెట్టెక్కెను. ఆచెట్టు మీద ఒక యెలుగుగొడ్డు ఉండెను. దానిని చూచిన తోడనే రాకుమారుడు మఱింత భయపడెను. క్రిందికి దిగిన పులి చంపును. పైనేయున్న ఎలుగుగొడ్డు చంపును. రాకుమారుడు ఏమిచేయుటకును తోచక గడ గడ వణక సాగెను.

అప్పుడు ఎలుగుగొడ్డు అతనిని చూచి "అయ్యా! నన్నుగూర్చి భయపడకుము.

నేను నిన్ను చంపను. ఈరాత్రియిక్కడనే యుండుము" అని ధైర్యముచెప్పెను. రాకుమారుడు హాయిగా నిద్రపోయెను. అతడు నిద్రించుచుండగా ఎలుగుగొడ్డు మెలకువతోనుండి అతనిని కాపాడెను. కొంతసేపటికి రాకుమారుడు నిద్రనుండి లేవగా ఎలుగుగొడ్డు అతనిని జూచి "అయ్యా! నేనుగూడ కొంచెముసేపు నిద్రించెదను. మెలకువతోనుండి నన్ను కాపాడుము." అనిచెప్పి నిద్రపోయెను.

ఆసమయమున క్రిందనున్న పులి రాకుమారునితో "అయ్యా! ఎలుగుగొడ్డు గూడ నావలెనే దుష్టజంతువు. నేను పోగానే అది

నిన్ను చంపును. కనుక దానిని క్రిందికి త్రోయుము. నేను దానిని తినిపోయెదను.” అని చెప్పగనే యతడు పులిమాటలు నమ్మి ఎలుగుగొడ్డును క్రిందికి త్రోయ నెంచెను.

ఇంతలో అది మేల్కాంచి రాకుమారుడు చేయనెంచిన పనిని గ్రహించి “అయ్యో! ఉపకారికి అపకారము చేయుట తగునా? నాచేసిన మేలును గుర్తింపక నాకే కీడు చేయనెంచితివి. కావున ఇందుకు శిక్షగా మూగవాడవు కమ్ము” అని శపించెను. రాకుమారు డప్పుడే మూగవాడయ్యెను. బాలకులారా! ఎప్పుడైనను మేలుచేసిన వారికి కీడుచేయుట తగదు.

## ౪. ఎగతాళికైన అబద్ధము చెప్పరాదు.

ఒక గ్రామములో పాపయ్యయను ఒకవర్తకుడు గలడు. అతనికి చాలకాలము వఱకు బిడ్డలు లేరు. తనకు బిడ్డలు గలిగితే గుడి కట్టింతునని ముడుపుగట్టెను. అందుమీద అతనికి ఒక కూతురు గలిగెను. కాని గుడి కట్టించ లేదు. ఎవరైన గుడి కట్టించ లేదేమని యడిగితే పుట్టినబిడ్డ చక్కగా ఉంటే కట్టింతునని చెప్పెడివాడు. దేవుని దయవలన ఆబిడ్డ చక్కగా పెరిగి పెద్దదయ్యెను. పాపయ్య తన కొమార్తెకు పెండ్లిగూడ చేసెను. ఆమెకుగూడ సంతానము గలిగెను. అప్పటికిని ఆవర్తకుడు గుడి కట్టించ లేదు. "ఏమయ్యా ఇంకను గుడి కట్టించి

నావు కావేమి?" యని చుట్టు పక్కము లడి గితే "ఏదో మొగతాళి కన్నానుగాని నిజముగా గుడి కట్టింతునా?" యని చెప్పెడి వాడు.

ఈరీతిగా నిద్రలేచినది మొదలు పాపయ్య యెన్నో అబద్ధములు చెప్పెడి వాడు. ఒకప్పు డతడు తనయల్లునితోఁగలిసి ఓడ వర్తకమునకుఁ బోయెను. ఆయోడలో రత్నములు వజ్రములు మొదలగు వస్తువు లెన్నో యుండెను. పాపయ్య ఒక పట్టణము దగ్గఱ పడవ నాపి బసచేసెను. ఒకనా డతనియొద్దకు సన్యాసి యొకడు వచ్చి "అయ్యా! ఈపడవలో ఏమున్నవి?" యని యడిగెను. అందుకు బదులుగా పాపయ్య

"ఏమున్న నీకెందుకు? అసలు మాతో నీకేమిపని? మాపడవలో కుండలు, పెంకులు, ఆకులు, తీగెలు ఉన్నవి" అని చెప్పెను. ఆలాగున అబద్ధము చెప్పినందుకు సన్యాసి కోపగించి "అట్లేయుండుగాక!" అనిపలికి తన దారిని బోయెను. సన్యాసి మాటలు పాపయ్య లెక్క చేయలేదు.

కొంత సేపటికి పాపయ్య పడవలోనికిబోయి చూడగా తాను చెప్పినట్లే యుండెను గాని రత్నములు వజ్రములు లేవయ్యెను. ఇదేమి కర్మమా యని యతడు భోరున ఏడ్చెను. అప్పుడతని యల్లుడు "మామా! సన్యాసితో అబద్ధము చెప్పితివి గనుక యింత జరిగినది. ఇంతటనైన బుద్ధిగలిగి

ఆయన యొద్దకుంబోయి తప్పు క్షమింపుమని ప్రార్థింపుము. పద" యనిచెప్పగా పాపయ్య యట్లే చేసెను.

సన్యాసి దయగలవాడుగనుక "ఓవర్తకుడా! నీవిప్పటి వఱకు ఎన్నో అబద్ధము లాడితివి. కాని యెగతాళికైన అబద్ధము చెప్పరాదు. ఇంక ముందుగూడ అబద్ధము లాడుదువేని నీభాగ్యమంతయు పోడగును. నీవంశము చెడును." అనిమందలించి పడవలోని వస్తువుల నెప్పటియట్లు చేసెను. అప్పటినుండి పాపయ్య అబద్ధము చెప్పుట మానెను. ఇదివఱకు ముడుపుగట్టిన ప్రకారము గుడి కట్టించెను.

---

## ౫. చదువుకొన్నవానికంటె చాకలి మేలు.

ఒకపల్లెలో రంగమ్మయను ఒక బ్రాహ్మణ స్త్రీ గలదు. ఆమెకు లేక లేక ఒక్క కూతురు గలిగెను. ఆబిడ్డకు పెండ్లియీడు రాగానే రంగమ్మ యెందఱెందఱినో విచారించి, యెన్నిచోట్లనో వెదకి, తగిన సంబంధమును నిశ్చయించుకొనెను. పెండ్లికుమారుడు చూడచక్కనివాడు. పెద్దతరగతి వఱకు చదివినాడు. కావలసినంత ఆస్తి గలవాడు. రంగమ్మ చాలడబ్బు ఖర్చుపెట్టి బిడ్డకు పెండ్లిచేసెను.

ఆనాడే ఆయూరి పెద్దచాకలి కొమార్తెకు గూడ పెండ్లియయ్యెను. కాని చాకలివాని

యల్లునిగూర్చి ఒక్కరును చెప్పుకోలేదు. రంగమ్మ యల్లునిగూర్చి పల్లెలోనివారం దఱు గొప్పగా చెప్పుకొనసాగిరి. తన యల్లునిగూర్చి చెప్పుకోక పోయిరే యని పెద్దచాకలి భార్యను కష్టముగా నుండెను. తనయల్లుడు వట్టి దద్దమ్మయనియు తలంచెను. "కోరికోరి మంచియల్లుని తెచ్చితివిలే" యని మగనిమీద కారాలు మిరియాలు నూరసాగెను.

ఈసంగతి గ్రహించి చాకలి యల్లుడు అత్త యొద్దకుఁబోయి "అత్తా! నేనే తెలివిగలవాడనో, ఆబాపనమ్మగారి అల్లుడే తెలివిగలవాడో నీకిప్పుడే తెలియగలదు. ఇదిగో ఈకానిడబ్బు తీసుకపోయి ఆయనకిచ్చి

"కూట్లోకి కూర, గోడ్డుపలుపుకు నార, పోయిలోకి పుల్ల, సిగలోకి పూలు, చేలోకి గింజ, దూడకు మేత, తె"మ్మని చెప్పు. దీనితో ఆయన తెలివి బయటపడగలదు." అని చెప్పెను. కానిడబ్బుకు ఇన్ని దొఱకునా యని చాకెతయే అనుమానించెను. కాని యేమిజరుగునో చూతమని అల్లుడు చెప్పి నట్లు చేసెను.

కాసేపటిలోనే పల్లెలోనివారి కందఱికి ఈవింత తెలియవచ్చెను. ప్రతివారును చాకలి యల్లునకు బుద్ధిలేదని తిట్టసాగిరి. రంగమ్మ అల్లుడుగూడ మంచి తెలివితేటలు గలవాడే. కాని యేమితోచలేదు. "కాని డబ్బుకు వాడుమాత్రము ఇన్నివస్తువులు

తేగలడా” యని అనుకొని చాకలి వానిని పిలిపించి “ఓరీ! కానీకి ఇన్నివస్తువులు తెచ్చుట నాచేతగాదు. నీవుగనుక తెచ్చి నట్లయితే నాకంటె నీవే తెలివి గలవాడ వని అందఱి యెదుట ఒప్పుకొందును” అని చెప్పెను. అక్కడ నున్నవా రందఱు “వాడు తేకేమి మేము చూడకేమి!” అని పక్కున నవ్విరి.

కొంత సేపటికి చాకలియల్లు డొకగోగుల కట్టను దెచ్చి “అయ్యా! ఇందులో నేచెప్పిన వస్తువు లన్ని గలవు. చూడండి. దీనికూర కూట్లోకి కూర. దీనినార గొడ్డుపలుపుకు నార. దీనిపుల్ల పొయిలోకి పుల్ల. దీనిపూలు సిగలోకిపూలు. దీనిగింజ చేలోకి గింజ. దీని

కాడలు దూడకు మేత. దీనివెల ఒక కాని మాత్రమే. తెలిసినదా?" యనిచెప్పెను. అతని తెలివికి ప్రతివారును ఆశ్చర్యపడిరి. రంగమ్మయల్లుడుగూడ అతనితెలివికి మెచ్చి "చదువుకొన్న వానికంటె చాకలివాడే మేలు" అని పలికెను. ఇప్పుడు పెద్దచాకలి భార్యకు కలిగిన సంతోషమునకు మేరయే లేదు. ఆనాడు అల్లుని పెరుగులో ముంచి నేతిలో తేల్చి అరిసెల పళ్ళెముమీద ఆర వేసింది.



## ౬. కొండను మోయుట

పల్నాటిసీమలో ఒకచిన్న పల్లెటూరు గలదు. ఆయూరిలోని వారందఱు మోటు

జాతివారు. ఒకరు చెప్పితే వినరు. వారికి తోచదు. అయితే యేదన్న వింతసంగతి చెప్పితే దబ్బున నమ్ముతారు. నిజమా అబద్ధమా అని యేమాత్రము విచారింపరు. ఎవడైన ఒకకొత్తవాడు వచ్చి "మా గ్రామములో ఎద్దు ఈనింది" అని చెప్పితే "ఏమి దూడ పెట్టింది" అని అడుగుతారే కాని "ఎద్దేమిటి? ఈనుటేమిటి?" అని యడిగేవారు కారు.

ఆపల్లెలో రామయ్యయను ఒక బ్రాహ్మణుడు గలడు. ఆయన గొప్పపండితుడు. అన్ని సంగతులు తెలిసినవాడు. ఏలాగయిన పల్లెలోని వారికి మంచిబుద్ధి గలుపవలెనని ఆయన పట్టుదల. కాని కొనసాగ

లేదు. చివరకొక యుక్తిపన్నెను. "ఈయూరిలోగల బాపన రామయ్య నల్లగొండ మోయును. మీరందఱు చూడ రావలసినది" అని యందఱికి చాటింపు చేసెను. ఇంక పల్లెలోని వారందఱు ఈమాట నిజమే యనినమ్మి నల్లగొండ దగ్గఱకు బోయిరి. రామయ్యగూడ వచ్చెను. ఆలస్య మెందుకు? కొండను మోయవేమయ్యా" యని ప్రజలందఱు ఆతని నడిగిరి. అందుకాయన "మీరందఱు దానిని లేవనెత్తి నానెత్తిమీద పెట్టితే మోయుదు" నని చెప్పెను. ఆమాటకు ప్రజలు "కొండను మే మెత్తగలమా?" యని పలుక "నేను మాత్రము మోయగలనా?" యని రామయ్య అనెను.

"అయితే యెందుకు చాటించినావు?" అని ప్రజ లడుగ "ఓ ప్రజలారా! మీ రేమాట చెప్పితే ఆమాట నమ్ముతారు. నిజమా? అబద్ధమా? యని ఆలోచింపరు. నామాట వినుడు. నిజము లేనప్పుడు దేనినిగూడ నమ్మరాదు. మనుష్యు డెవడైన సరే కొండను మోయగలడా? ఇది మీ రెట్లు నమ్మితిరి? కనుక నిది మొదలుకొని యెవ రేమి చెప్పి నప్పటికి నిజము లేకున్న నమ్మవద్దు. మీ కీమాట తెలుపుటకే నే నిట్లు చేసితి" నని చెప్పెను. ప్రజలు తమతప్పును దెలిసికొని యానాటినుండి మంచిబుద్ధి గలవారైరి.

బాలకులారా! మూర్ఖులకు మంచిబుద్ధి గలుపవలె నన్న పాండిత్యము పనికిరాదు. యుక్తితో ప్రవర్తించవలెను.

## ౭. అల్పునకు గొప్పతనము తగదు.

ఒక యడవిలో ఒక మునీశ్వరు డుండెను. ఆయన ఒకకుక్కను బెంచెను. అదియొక నాడు అడవిలోనికి బోగా అక్కడ ఒక పులి దానిని వెంబడించెను. పులికి భయపడి కుక్క మునీశ్వరుని యొద్దకు పరుగెత్తుకొని వచ్చెను. మునీశ్వరుడు గొప్పశక్తిగల నాడు గనుక తనకుక్కను పులిగా మార్చెను. దానిని జూడగానే తఱుముకొని వచ్చిన పులి భయపడి పాఱి పోయెను.

మఱొకనాడాకుక్క యడవిలోనికి బోగా ఏనుగు ఒకటి వెంబడించెను. కుక్కమును పటి మాదిరిగా భయపడి ఋషియొద్దకు

వచ్చెను. ఆయన దానిని ఏనుగుగా మార్చెను. దానిని జూచి మొదటి యేనుగు పారిపోయెను. ఈరీతిగా తాను మారుచుండుటచేత కుక్కకు దుర్బుద్ధి గలిగెను. ఈసారి గొప్పజంతువుగా మారినప్పుడు వెంటనే మునీశ్వరుని చంపి యెల్లకాలము గొప్ప జంతువుగా నుండవలెనని అది తలంచెను.

ఇంకొకనాడది అడవిలోనికి బోగా సింహ మొకటి వెంబడించెను. కుక్క యెప్పటి యట్లు భయపడి తనయొద్దకు రాగానే మునీశ్వరుడు దానిని సింహముగా మార్చెను. వెంటనే అది మునిని చంపబోయెను. ఆయన కుక్కయొక్క దుర్బుద్ధిని గ్రి

హించియెప్పటియట్లు కుక్క గామార్చి వెళ్ళ గొట్టెను. తన దుర్బుద్ధి చేతనే తన కట్ట యాపద గలిగెనని కుక్క యెంతో విచార పడెను.

---

## ౫. సజ్జన సహవాసము.

ఒక యడవిలో కొందఱు దొంగలు గలరు. వారెల్లప్పుడు దగ్గఱనున్న పల్లెలమీద పడి దోచుకొనుచు ఆధనముతో జీవించుచుం డెడివారు. వారికి దయాదాక్షిణ్యములు లేవు. ఒకరిని చంపుటయన్న వారి కెంతో సంతోషము. ధనముకొఱకు వారు చేయు చెడ్డపను లిన్నియని చెప్పలేము.

ఆయడవిలోనే ఒక రాకుమారు డుండెను. అతనిపేరు కాపవ్యుడు. ఆయన గొప్ప బలము గలవాడు. అందుకుతోడు మంచి గుణములు గలవాడు. ఈదొంగల సంగతి ఆయనకు తెలియును. దొంగలకుగూడ ఈతని సంగతి తెలియును. ఇతడన్న ఆదొంగల కెంతోభయము. ఎట్లయిన అత నిని తమకు నాయకునిగా జేసికొన వలె నని దొంగలందఱు ఆయన యొద్దకు బోయి "అయ్యా! నీవు మాకు నాయకుడ వుగానుండి మమ్ము రక్షింపవలసినది" యని ప్రార్థించిరి. కాపవ్యుడును అందుకు సమ్మ తించెను.

ఇతడు గుణవంతుడు గనుక ఇతని సహ వాసమునుబట్టి రాజులవేరిట దొంగలకు

గూడ బుద్ధి మార జొచ్చెను. అది తెలిసికొని కాపయ్య డొకనాడు దొంగ లందఱిని రావించి "ఓరీ! ధనముకొఱకు మీ రెవ్వరిని చంపగూడదు. ఇండ్లలో జొరబడి దొంగి లింప గూడదు. చెడ్డపనులు చేయరాదు. ఇందు కెవరైన తప్పితిరా గొంతు కోసె దను" అని భయపడునట్లు బోధించెను. అది మొదలు దొంగ లందఱు భయము చేతనో లేక భక్తిచేతనో మంచిబుద్ధి గలిగి యుండిరి. ప్రజలకు దొంగల భయము తగ్గి పోయెను. కాపయ్యడు తమకు చేసిన మేలుకు బదులుగా ఆచుట్టు పట్టి కలనున్న ప్రజలందఱు అతనిని ప్రభువుగా నెన్ను కొనిరి. బాలకులారా! మంచివారి సహా

కన్నిటికి నేనే ప్రభువు నగుదును." అని యీవిధముగా మంకెన ఆలోచించి అప్పుడే ప్రభువైనట్లు సంబర పడెను.

ఆనాటిరాత్రి యీప్రకారాలోచించిన దంతకలలో గాంచుచు మంకెన గుఱ్ఱుపెట్టి నిద్రపోయెను. ఆసమయమున ఇంటిలో దొంగలుపడి ఉన్న ధనమును దోచుకొని పోయిరి. తెల్లవారు నప్పటికి కట్టుత్రాళ్ళు తెంచుకొని జోడెద్దులు పాఱిపోయెను. ఉన్న ధనము పోవుట, జోడెద్దులు మాయమగుట ఈరెండు కారణములచేత మంకెనకు పిచ్చియెత్తినట్లయ్యెను. "అయ్యో! నేను అనుకొన్న దేమిటి? ఇప్పుడు జరిగిన దేమిటి!"

అని యత డెంతో సేపు దుఃఖించెను. పాపము! ఏమి చేయగలఁడు? చదువు కొన్న వాఁడు గనుక-

ద్విపద.

ముందు సంగతిగూర్చి-మఱి యుంగ రాదు
ఎందేమి జరుగునో-యెఱుఁగ లే రెవరు.

అని ఒక పద్యము మాత్రము వ్రాసెను. బాలకులారా! తా నొకటి తలంచిన దైవ మొకటి తలంచుననుట యిట్లేయుండును.

## ౧౦. పెద్దలమాట చద్దిమూట.

ఒకయూరిలో రంగయ్య మంగయ్య అను ఇరువురు స్నేహితులు గలరు. వీరిద్దఱు ఈతలో మొనగాండ్రు. ఏటినిండ నీళ్ళు

న్నప్పుడుగూడ అవతలి యొడ్డుకు, ఇవ తలి యొడ్డుకు, అవలీలగా నీదగలరు. ఒక నాడు వీరిద్దఱు ఏదోయొక యూరికి పోవు చుండిరి. త్రోవలో నొక వాగును దాట వలెను. మాపుల కది చిన్నదే కాని నిండ నీళ్ళున్నప్పుడు దాని నెంతటియాతగాడై నను దాటలేడు. ఆనాడు వాగు పూర్తిగా నుండెను.

వాగు దగ్గఱనే పొలము దున్నుచున్న ఒక ముసలికాపు వారిని జూచి "అయ్యాలారా! ఈత వచ్చినప్పటికి ఈపూట దాట వద్దు. ఇదిచిన్నదే కాని దీనిలో సుడిగుండ ములు చాలగలవు. కనుక నామాట విని తిరిగిపొండు" అని చెప్పెను. అందుకు

మంగయ్య "తాతా! ఏటిలో ఈదుటకే మేము భయపడము. ఊరు పేరు లేని యీచిన్న వాగును దాటలేమా? మాశక్తి నీకు తెలియదులే" అని పలికెను. అందు కాముసలి కాపు "అయ్యా! నేనుగూడ ఈదగలవాడనే. ఈవాగు సంగతి నాకంటె మీ కెక్కువ తెలియదు గనుక వద్దని చెప్పితిని తరువాత మీయిష్టము." అని చెప్పెను. రంగయ్యగూడ కాపువాని మాటలయందు సత్యమున్నదని గ్రహించి మంగయ్యను దిగవద్దనెను.

అందుకు మంగయ్య పకపక నవ్వుచు "ఒరే! నీవుగూడ తాతవైతివా యేమి? నీవు వట్టి పిరికి వాడవురా?" అని వెక్కిరించి ముసలి

కాపు "వద్దువద్దు" అని మందలించుచున్నను వినక వాగులో దుమికెను. అదేమిచిత్రమో కాని అతడు తిరిగి కన్పడలేదు. రంగయ్య ఆత్రముతో చూడసాగెను. ఎంతసేపు చూచినప్పటికి మంగయ్య కన్పడనేలేదు. అయ్యో అయ్యోయని రంగయ్య పెద్ద పెట్టున నేడ్చెను. బాలకులారా! పెద్దల మాట విననివాడు చెడిపోవును. ముసలి కాపుమాట వినని మంగయ్య మరణించెను. విన్న రంగయ్యయేకష్టములేక సుఖముగా నుండెను.

---